సి. నారాయణరెడ్డి

# కర్పూర వసంతరాయలు

(కావ్యం)

పూచిన ఫిరికన్నెలన్ని
పూర్ణాయువు నొందునిందు'

## పరిచయము

ఆచంట జానకిరామ్

There is nothing too small, but my tenderness paints
it large on a background of gold,
and I prize it, not knowing whose soul at the sight,
released, may unfold . . .

*Rainer Maria Rilke*

ఉగాది, 1958

నన్ను మరచిపోరు కదూ!

జానకిరామ్.

[illegible]

20.3/58

కొండవీటను పాదుకొన్నట్టి మట్టిలో
సైతమ్ము కర్పూర సౌరభమ్ములు వీచు.

కావ్యానికి చిట్టచివర ఉన్న రెండు పంక్తులతోనే ఈ పరిచయము ప్రారంభించడము కాస్త వింతగా తోచవచ్చు. కాని, నిజానికి, ఈ కావ్యవస్తువంతా ఇందే ఇమిడి ఉన్నది. ఫిట్‌జరాల్డ్ అంటాడు: సీజర్ హృదయరక్తంతో తడిసిన మట్టిలో పుట్టిన గులాబీకి ఉన్న రక్తిమ మరి ఏ గులాబీకీ ఉండదని. అలాగే, పరమ సాధ్వి లకుమ రక్తంతో తడిసిన కొండవీటి మట్టిలో సైతము, కర్పూరసౌరభమే వీస్తుంది: ఆమె, కొండవీటి ప్రభువైన వసంతరాయలూ తమ పరస్పరప్రేమ జీవితాన్ని ఆరని కర్పూరజ్యోతిగా వెలిగించారు కాబట్టి; కర్పూర వసంతరాయల తనువు, ఆత్మ, సర్వమూ ఆమెలో లీనమైపోయాయి కాబట్టి.

పంచభూతాత్మకమైన నిఖిలసృష్టికీ లకుమనే ప్రతీకగా ఎంచాడు, కర్పూర వసంతరాయలు: పృథ్వి ఆమె కటిచక్రము; జలమామె కంటిపాపలలోతులు; తేజము ఆమె ముఖరాజీవము; వాయుగతి ఆమె నిశ్వాసములు; ఆకాశమామె మధ్యము, అతని దృష్టిలో. ఆమె ముఖముకురమ్ములో తనమోము సరిచూచుకునే వాడట! ఆమె కనుపాపలలో కురులు దిద్దుకొనే వాడట! అట్టి ప్రేయసి లకుమ, అతనిని ఉద్దేశించి అంటుంది.

నీవు నిండు చందురుడవు
నేనో కల్వల చెల్వాను
పరిమళ సోపాన పంక్తి
ఇరువురి నేకముజేసెను... అని.

నారాయణరెడ్డి తన ఊహాప్రపంచకంలో సృష్టించి, రమ్యమైన పదజాలంతో అద్భుతచైతన్యమిచ్చిన వీరి మహత్తర ప్రేమ గాథ సున్నితహృదయ వీణాతంత్రులను వింతగా ప్రయోగిస్తుంది. సున్నితహృదయులే కాదు; ప్రపంచమంతా ఇట్టి ప్రేమికులను ప్రేమిస్తుంది - అంతటి ఆర్ద్రతఉన్నది, వారిప్రేమలో! ఒక విచిత్ర సన్నివేశంలో, రాజు ఆ దివ్యనర్తకిని ఉద్దేశించి ఇలా అంటాడు :

ఈ పాదములే కాదా
భూపాలుడనైన నన్ను
అనంత రసరాజ్యమ్మున
కధీశ్వరునిగా జేసెను.

ఈ చరణములే కాదా
రాచవాడనైన నాకు
రెక్కలిచ్చి గంధర్వ వ
రేణ్యునిగా నొనరించెను.

ఈ పదముల రాపాడను
నూపురముల చిరుగజ్జెలు
చప్పని నా బ్రతుకులో ర
స ధ్వనులను పలికించెను... అని.

ఇట్టి పొగడ్తను మరీ మరీ వింటూన్న ఎట్టి స్త్రీ హృదయమూ ఉబ్బి, తబ్బిబ్బుకావడము అతిసహజము. కాని, బేల, ప్రేమస్వరూపిణి లకుమ పదే, పదే తన్ను ప్రశంసించే రాజుతో అంటుంది:

ప్రభూ! చరణదాసి నిటుల
ప్రశంసించ తగునా
కాలిధూళి యేనాటికి
గంధపుపొడి యగునా....

మీపాద పరాగము నా
పాపట సిందూరముగా
కైసేసెడు భాగ్యమున్న
కావలసిన దేమున్నది....అని.

కాలిధూళి - గంధపుపొడి; పాదపరాగము—పాపటసిందూరము; ఈ పదముల పొందిక గమనింపతగినది. ఇలాగే, కావ్యమంతటా, అందమైన మాటలు పచ్చకప్పురపు పలుకులులా పరిమళిస్తాయి.

అన్నట్టు, నారాయణరెడ్డి ఈ తన ప్రబంధాన్ని 'కావ్యము' అన్నారు కాని, 'పద్యకావ్యము' అనలేదు. ఇది సబబే! నిజానికి, ఇదిఒక పద్యకావ్యము మాత్రమేకాదు. ఇందు ఎన్నో అందమైన ఖండకావ్యమంజరులున్నాయి; కొన్నికొన్ని ఘట్టాలలో అద్భుతమైన నాటకమున్నది; రాజనర్తకిచరిత్ర కాబట్టి, పదే, పదే, నాట్యకళతాండవిస్తుంది. వీటికితోడు, మనలను మరీ, మరీ, ఆకర్షించేది

ఈ కావ్యంలోని చిత్రకళ. సిద్ధహస్తుడైన చిత్రకారుడు చిత్రించి నట్లు హృదయరంజకమైన బొమ్మలు చిత్రిస్తారు, ఈ కవి.

వసంతోత్సవ సమావేశానికి వెళుతూన్న రాజును పౌరకామి నులు చూస్తారు, ఇలా:

ఒక్క తలుపురెక్కదీసి
ఒయారముగ అణుమధ్యలు
మధ్యలు తిలకించినారు
మహీశ్వరుని యువమూర్తిని.

పూజచేస్తూన్న వసంతరాయలు:

గుప్పెడంత కుంకుమపొడి
గుప్పెను అచ్చరలపైన
దోసెడన్ని పూవులెత్తి
పోసెను మధుమూర్తిపైన.

ఇలాగే, 'ఒక పాలరాతివేదికపైన వ్రేలు యవనిక వెండి మలపైని నీలమేఘమురీతి కన్పించె.' అనీ, 'అత డామెను చూచుచుండె; ఆమె అతనిని చూచుచుండె; ఆదిదంపతుల మాదిరి ఆ చూపులు తోచుచుండె,' అనీ.

మరి ఒకచోట:

అత డామెనుజేర అడుగు నించుకలేపె
రాణి యాతని భుజాగ్రాన చేయిని మోపె
ఒక్కమారుగ ప్రభువు
ఉలికిక్కపడి తను తాను జూచికొనె...

ఒక్కమారుగ లకుమ
ఒయ్యారముగ తా నిలిచిపోయె.

ఈ దృశ్యాలు కలంతో వ్రాసినవికావు; కుంచెతో చిత్రించినవి. ఇంకా ఎన్నో, ఇలాంటివే :

రాజును లకుమయు గుండెలు
రాచికొనగ చూచుకొనిరి
ఆ చూపులు విడిపోవుట
కై మోములు దించుకొనిరి.

ద్రాక్షారామంలో శివుని యెదుట నృత్యంచేస్తున్న లకుమ :

అభినయించెను లకుమ భువిపై
అవతరిలు శంపాలతిక యన
కదలి శంభుని యడుగుదమ్ముల
నొదిగి నిల్చిన హైమవతిగా.

పట్టపురాణి తనవద్దకువచ్చి, రాజును విడిచిపొమ్మనిచెప్పి, వెళ్ళాక లకుమ :

ఒక్కతియె తా నిల్చిపోయెను
దిక్కులన్నియు బిక్కుమనియెను
గుండె తెగి అస్రములు కన్నుల
కొలకులంబడి దూకిపోయెను.

ఆకస్మిక మృత్యువాసన్నమైన లకుమ :

లకుమ వదనముపై రాహుగ్రహగ్రస్త
చంద్రబింబాతస్థ చరమకళ కన్పించె.

ప్రాణనాధుని చేతులలో ప్రాణములు వదలు లకుమ :

ఆ మహాసాధ్వి రాయని కరాంభోరుహ
మ్ములలోన శాశ్వతమ్ము కనులు మూసికొనె.

ఇటువంటి బొమ్మలకు చక్కటి చిత్రాలు కట్టించి, తమ గది గోడలపైన తగిలించుకోవాలని ఉంటుంది చిత్రకళా ప్రియులకు.

ఏ పదిహేనేళ్ళక్రితమో, (స్వర్గీయులు) భావరాజు వెంకట కృష్ణారావు 'లకుమాదేవి' అనే చక్కని కథ వ్రాసి ప్రచురించారు. ఆ కథ ఆధారంగా, రజని సంగీతనాటిక వ్రాసి 'ప్రతిభ'లో ప్రచురించారు. ఆ కథలో పట్టపురాణి ప్రస్తావనలేదు. కర్పూర వసంతరాయలను గురించీ, లకుమాదేవిని గురించీ ముచ్చటైన వర్ణనలున్నాయి. అతడామెకొరకు 'గ్రహరాజసౌధము' అనే బ్రహ్మాండమైన మేడ కట్టిస్తాడు. కాని, కొన్నాళ్లకు, లోకుల గుసగుసలు విని, లకుమశీలాన్ని గురించి శంకించి, పరీక్షకి రాజు ఆమెను ఆ మహాసౌధాగ్రమునుంచి క్రిందికి దూకుమని ఆజ్ఞాపిస్తాడు. వసంతరాయని పాదపద్మములనే ధ్యానిస్తూ క్రిందికి దుమికిన లకుమ నేలరాలిన తలిరాకులా చెక్కుచెదరకుండా ఉండడము చూసి, ప్రజలు ఆమెను మహాసాధ్విగా అంగీకరిస్తారు. ఇనుమడించిన ప్రేమతో రాజు ఆమెను కౌగిలించుకుబోతాడు. కాని, తన సుశ్శీలతను నిరూపించిన లకుమ ప్రియుడు చూపిన అవిశ్వాసమును సహింపదు. మొలలో దాచుకొనిన బాకుతో పొడుచుకొని అతని చేతులలోనే చనిపోతుంది.

నారాయణరెడ్డి కావ్యంలో పట్టపురాణి ఉంది. ఈ పాత్రను చాలా చక్కగా పోషించారు. లకుమ యందు మనకు కలిగిన

ప్రేమాతిశయంలాగే, రాజుయందు గౌరవాతిశయం కలుగుతుంది. రాజు ఉపదేశాన్ని అనుసరించి లకుమ ఈ లోకమునుండి నిష్క్రమించడమువల్ల రాజుపై కోపమురాదు మనకు. లకుమ అంటే పట్టరాని జాలి కలుగుతుంది. ఆ తరువాత, నావంటివానికి వసంతరాయలపై కోపంవస్తుంది. కాని, అందరకూ రాకపోవచ్చును. ఏమైనా, ఈముగ్గురి పాత్రలూ, వసంతరాయని బావమరది కాటమ రాయని పాత్ర, చాలా చక్కగా పోషించారు కవి, నాటకమే అన తగిన ఈ కావ్యంలో.

మొట్టమొదటసారి వసంతరాయలు లకుమానర్తకి నృత్యమును చూచిన సంఘటన, హైమవతీ పరమేశ్వరుల ప్రణయమును వర్ణించే నృత్యసందర్భము, నిండు కొలువున ఉన్న వసంతరాయలు తాను అంతఃపురంలో విడువలేక విడువలేక విడిచివచ్చిన లకుమ కాలు బెణికినదని విన్నప్పుడు ఉన్న పాళంగా అంతఃపురానికి పరుగెత్తడము, అర్ధరాత్రివేళ రాజు, లకుమల సమావేశము, చివరకు, లకుమ ప్రాణత్యాగము—ఈ సన్నివేశాలు, ఒక్కొక్కటి, ఒక చక్కని నాటకాంకంగా అమరినవి. ఈ సంఘటనలలోని నాటకీయత కవిత్వపు ప్రతిభకు వన్నె తెచ్చింది.

ఐదు ఆశ్వాసాలకావ్యము కర్పూర వసంతరాయలు. 'కళా దుగ్ధసాగర మనోముగ్ధ సంపూర్ణ చంద్రమూర్తి' ఐన కుమారగిరి ప్రభువును సంబోధిస్తూ కవి చెప్పెడి విజయ వాక్యాలే మాగధుల కైవారాలుకాగా, చైత్ర శుద్ధ త్రయోదశీ నాటి వసంతోత్సవము ప్రారంభమవుతుంది. ఇచట వర్ణనలు ఎంతో సొంపుగా ఉంటాయి :

ఏ మొగమ్మున చూపు నిల్పిన
ఇగురువోసెడు కాంతివల్లులు
ఏ సిగను పరికించి చూచిన
ఏటవాలుగ నవ్వుమల్లెలు.

ఏటవాలుగ నవ్వు మల్లెలు ! ఎంతో క్రొత్త అందము.

కుమారగిరీ, కాటయ వేమారెడ్డీ, వీరిద్దరి ఆప్యాయతా ఇక్కడ చక్కగా చిత్రిస్తారు కవి. రాణీని కూడా, మొదటిసారి ఇక్కడే చూస్తాము :

రాయడు పూవిల్తుని పూజించె; రాణి నీడవోలె అనుసరించె.

మన్మథపూజానంతరము, వసంతోత్సవ వేడుకలు ప్రారంభిస్తూ, నిండు దోసిళ్ళతో మృగమద శ్రీచందన రజము, కుండికలతో అచ్చగొజ్జంగి నీరము క్రుమ్మరిస్తాడు వసంతరాయలు. అప్పుడు :

తన్మయత్వమె అ
ధారమ్ముగా సాగి
కపుర మొండొరులపై
కలయ జల్లిరి జనులు...

ఎటు చూచినను కపురమే గంధమే
ఏ దెసను ఆనందమే అందమే.
కర్పూర కస్తూరి
[illegible]

నేలయేకాదు నిం
గియు పరిమళించినది!

చక్కని ఉత్ప్రేక్ష. రాత్రి, వసంతోత్సవనృత్యము. వాద్యములు మ్రోగగా, పాలరాతివేదికపైన, ఇందాకటి వెండిమలపైని నీలమేఘము రీతి కన్పించే యవనిక తొలుగగా, మెరుపులా మెరుస్తుంది, ఒక నర్తకి. ఆమెయే లకుమ.

లకుమ నృత్యము కవి వర్ణనలలోనే చదువాలి. ఊరికే చెపితే చాలదు. ఆమె లావణ్యము, నాట్యకౌశల్యము చూచి

తనపైన పారిజాతములు జలజల కురిసి
నటుల పులకించె నా యవనిపతి.

నృత్యము సాగగా, సాగగా, వసంతరాయలు తన్మయుడవుతాడు; చిన్మయుడవుతాడు. ఆతని పంచప్రాణాలు లకుమయందే లగ్నమవుతాయి. ఆనందపరవశుడైన రాజు, ఒళ్ళు తెలియక, నర్తకిని జేర లేవబోతాడు. అతని భుజాగ్రాన చేయిమోపి, రాణి అతనిని ఆపుతుంది—అసూయవల్లకాదు; మర్యాద పాటించడము కోసము. కాని, మహారాజు నర్తకి నాట్యకౌశల్యాన్ని మెచ్చి బహూకరింపవచ్చు. తన మెడలోని రత్నహారమును తీసి నర్తకి మెడలో వేస్తాడు వసంతరాయలు. దండతోపాటు అతని చేతులు కూడా ఒక్కక్షణం దండలా అమరుతాయి ఆమె కంఠసీమను. జనుల హర్షనాదాలు ఆకాశాన్ని అంటుతాయి. అప్పుడు,

సిగ్గుతో తల వాల్చి మొగ్గయయ్యెను లకుమ
నవ్వలేకయె లోన నవ్వుకొన్నది రాణి.

వర్ణన ఎంతో చక్కగా అమరినది కాదూ? స్వభావచిత్రణా చాలా బాగుంది.

రెండవ ఆశ్వాసము కథ లకుమా, వసంతరాయలూ ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకొనుట గురించి. విరహవర్ణనలు కొంత వరకు పూర్వప్రబంధశైలిని ఉన్నా, మళ్ళా, అందులో ఎంతో క్రొత్తదనము. ముఖ్యంగా, భాష. లలితమై, సరళమైన తెలుగు మాటలు ఎంతో అందాన్ని ఇస్తాయి. పద్యం నడక తీరుకూడా సొంపుగా ఉంటుంది, మెల్లిగా ఊగే ఉయ్యాల ఊపులాగ:

ఎపుడువీచిన గాడుపే కద
ఎందుకో నే డంతవాడి ?
ఎపుడుకాచిన వెన్నెలేకద
ఎందుకో నేడంతవేడి ?

కొంచెము ముందే, పాన్పుపైచల్లిన మల్లెపువ్వులు వసంత రాయలకు పల్లేరుకాయలలాతోస్తాయట. చంద్రునిచుట్టూ చంక్ర మించే వేయి చుక్కలలాగ, లకుమ చుట్టూ లాస్యమాడతాయట లక్ష ఊహలు! ఇంతెందుకు ? నేల నిద్దరపోతుంది; నింగి నిద్దర పోతుంది; గాలికూడా నిద్దరపోతుంది—ఒక్క రాజే అదరిపోయి, చంద్రనిప్పులలాటి పాన్పుమీద పొరలుతూ ఉంటాడు.

అక్కడ, లకుమ అవస్థా అల్లాగే ఉంటుంది:

ఎపుడు చూచిన చంద్రుడేమరి
ఎపుడు పూచిన తారలే నే
డెందుకో అవియెల్ల అమృత
స్యందులై డెందము గరంచెను....

ఆమె వింత కలగంటుంది: తాను రాధ; వసంతరాయలు వేణుగోపాలుడు. పండువెన్నెల.

అంత సంబరమందు ఒకరే
డచ్చవెన్నెల లొల్కబోసెను
అంతరంగమునందు ఒకరే
డలతినవ్వుల నారబోసెను.

వాడినకొలదీ, ఎక్కువయే, పొగడ పువ్వువాసనలా రోజులు గడచిన కొలదీ రాయలమనస్సులో లకుమ సంస్మృతి ఇంకా, ఇంకా మించిపోతుందట.

తన అనుగుచెలికాడు, శ్రేయోభిలాషి, కాటయవేమునితో సంప్రతించి లకుమను రాజనర్తకిగాచేస్తాడు రాజు. ఆ తరువాత, వసంతరాయలు లకుమ తన వెంటరాగా, అహోబలక్షేత్రానికి యాత్రవెళ్ళి, అక్కడ నృసింహస్వామిని ఆరాధిస్తాడు. స్వామి ముందు లకుమ అందమైన చెంచెతగా నృత్యంచేస్తుంది. కాని, ఉగ్రనృసింహమూర్తిరూపము చూడడముతోనే, ఆబేల బెదిరిపోయి, మూర్ఛిలబోతూండగా, రాజు భుజమామెకు ఆస్కారమవుతుంది. వెంటనే, తన అపచారమును తెలుసుకొని, అతని పాదములపై వ్రాలుతుంది లకుమ.

ఇటువంటి అందమైన 'చమక్'లు ఎన్నో ఉన్నాయి ఈ మూడవ ఆశ్వాసంలో.

వారిద్దరూ ద్రాక్షారామంకూడా వెళుతారు. అక్కడ, సంధ్య వేళ, శివునికి నాట్యనైవేద్యంగా, హైమవతీ నృత్యంచేస్తుంది లకుమ.

కాని, హైమవతీ పరమేశ్వరులపై మన్మథుడు బాణము వెయ్యబోయే సమయంలో చటుక్కున లేచివెళ్ళి, 'లకుమా' అంటూ, కర్పూర వసంతరాయలు రాజనర్తకిని కౌగిలించుకుంటాడు. రసభంగంచేసే నీరసహృదయంవల్లకాదు; 'ఔచితజ్ఞుడైనా, ఆవేశవశుడు రేడు'. గద్గదస్వరంతో, వసంతరాయడంటాడు : ముందటి దృశ్యము ఇక చూడలేను;

పూలవింటిదొర నిల్వన
కాలిపోవ నెట్లు సైతు
శివగిరిజల బిగికౌగిలి
చెదరిపోవ నెట్లు సూతు....అని.

శివుని కవుగిటిలో పార్వతిలాగ, పార్వతి కౌగిటిలో శివుని లాగ, నా కౌగిటిలో నీవు, నీ కౌగిటిలో నేను అంటాడు. కాని, వెంటనే, 'ఏ మన్నాను! ఏ మన్నాను' అని తత్తరపడతాడు. పరిజనులు విభ్రాంతులవుతారు.

వారిక్షేమ దాచడానికి ఇక వారికి శక్యంకాదు. తన్మయురాలైన లకుమ రాజును గట్టిగా కౌగిలించుకుంటుంది. అప్పుడు, ఆమె అనిన ప్రియవచనాలు, మనభాష ఉన్నంతకాలమూ ఉంటాయి :

నాదేవర! నా గుండియ
పాదున రతనాలమొల్క!
నా మనసే పంజరమ్ము
గా మెల్లగిన రామచిల్క!

కొసరి కొసరి ఏడుస్తుంది లకుమ. 'అపుడె, తొలిసారిగ, తన మనసారగ, కౌగిలించుకుంటుంది' వసంతరాయలను.

ఇంతవరకూ వెన్నెల. నాలుగో అశ్వాసముతో చీకటిరేఖలు ప్రారంభిస్తాయి. లకుమా సమేతంగా రాచనగరుకు తిరిగివచ్చిన వసంతరాయని వర్తనము ప్రజలకు రుచింపదు. రాణి ఉండవల సిన వామపార్శ్వాన నర్తకి ఉండడమేమిటని గుజగుజపోతారు. కాటయవేమునికికూడా ఇది కిట్టదు. రాజునుచూచిన సంతోషంతో వికసించిన అతని ముఖపద్మము, వసంతరాయలతోకూడా లకుమను చూడడముతోనే సగము మూసుకుపోతుందట. పూర్తిగా కాదు సుమా! వేమునకు అంతప్రేమ రాయలపైన. రాయలను, నర్తకిని, ఇలా, జంటగా చూడవలసివచ్చిన రాణి సుడిగాలి చరచి నట్టు జడిసిపోతుంది. వడదెబ్బతాకినట్టు వడకిపోతుంది.

ఆమె నేత్రములందు
అమవసలు జడలు విరబోసుకొనె
ఆమె హృదయాంగణము
నందు శూన్యము చోటుజేసుకొనె.

శూన్యము చోటు చేసుకున్నదట!

తరువాత, కాటయవేముడు విజయనగరముపై జైత్రయాత్ర విషయమై కుమారగిరితో ముచ్చటిస్తాడు. 'వెంటనే బయలు దేరాలి; వేమూ వస్తాము, మీతో!' అంటాడు రాజు. కాని, మరు క్షణమే జ్ఞాపకమువస్తుంది అతనికి, తాను లకుమను విడిచి ఉండలేడని. కాటయవేముడు ఒక్కడే వెళుతాడు జైత్రయాత్రకు.

వసంతరాయలు లకుమకై రమ్యమైన కేళికాహర్మ్యమును నిర్మిస్తాడు. ఈ సందర్భంలో కవి చేసే వర్ణనలు ఎంతో చమత్కారంగా ఉంటాయి. ఇదివరకున్న రచనలలో, ఎంతో తపస్సు చేసి గిరికాదేవి నాసికగా రూపందాలుస్తుంది గంధఫలి; ఒకానొక అందకత్తె కన్నులులాగ లేమేయని వాపోతాయి కల్వలు; చక్రవాక మిధునాలూ అంతే. కాని, ఈకవి ఊహలో, ఆ కేళీహర్మ్యంలో వెలసిన బంగారు తలుపులు వనితల మెయివన్నెను చూచి నవ్వుతాయి! పగడపు చూరులు పడతుల మోములను పరిహసిస్తాయి! ముదితల నవ్వులను చులకన చేస్తాయి ముత్యపు వాకిళ్ళు!

ఇటువంటి వాతావరణలో లకుమయే గానమ్ము, లకుమయే ప్రాణమ్ము, లకుమయే నాదబిందుకళానిధానమ్ము వసంతరాయనికి. లకుమ నిత్యమూ నాట్యము చేస్తుంది అద్భుతంగా, రేని ప్రోల, అహోరాత్రులూ, అతను తలచినపుడల్లా. ఆమె తనచెంత నుండగా, వసంతరాయలు అభినయశాస్త్రమును తెలిపే 'వసంత రాజీయము' రచిస్తాడు. ఆ మహాగ్రంథము పూర్తిఅయ్యాక, ఆమె చెక్కిళ్ళు నిమురుతూ, ప్రభువు అంటాడు :

ఓ లకుమా!
నీ ఊదిన ఊపిరియే
ఈ వసంతరాజీయము.

మనస్పూర్తిగాప్రేమించిన వ్యక్తి మహిమవల్ల ఎంతటి అద్భుతమైన కళాస్వరూపం అవతరించకలదో ఇతనిమాటల ద్వారా వ్యక్త పరుస్తారు కవి ఇచట.

విజయలక్ష్మీసమేతుడై, జైత్రయాత్రలనుంచి తిరిగి వస్తాడు కాటయవేముడు. రాజు పూర్తిగా రాచకార్యాల ప్రసక్తి మానినట్టు తెలుసుకుంటాడు. ఇదివరకు తానే స్వయంగా ప్రజల యోగ క్షేమాలు కనుక్కొంటూ వారి ప్రేమను సంపాదించిన కుమారగిరి కేళీభవనంనుండి బయటకు రాడు. ప్రజలు రకరకాలుగా చెప్పు కుంటారు. రాజు ఒకసారైనా కొలువుకూటాన్ని అలంకరింపవలసి నదిగా కోరుతాడు కాటయవేముడు. పరిస్థితులు గమనించి, రాజు అందుకు ఒప్పుకుంటాడు. తాను పూర్తిజేసిన వసంతరాజీయాన్ని మరదికి చూపుతాడు. కాటయవేముడు రాజులోని రసజ్ఞతకు ఉప్పొంగిపోయి, తాను రచిస్తున్న కాళిదాసుని శాకుంతలనాటక వ్యాఖ్యా రచనను ముగించి రేనిపాదపద్మములకు అంకితమిస్తా నంటాడు.

పంచమాశ్వాసంలో, కథ చకచకా నడిచిపోతుంది. నిండు పేరోలగమున కొలువు తీర్చిన కుమారగిరి చెవిలో, నాట్యం అభ్య సిస్తూన్న లకుమ కాలు బెణికినదనే వార్తవేస్తాడు ప్రతీహారి. చటు క్కున లేచి నిలుచుని, ఉన్న పాళంగా అంతఃపురానికి పరుగెత్తు తాడు రాజు. ఇది సభికులకు తల వంపుగా ఉంటుంది. 'ఒక నర్తకి కాలు బెణుకుటేమి? ఎకిమీడు పరుగులెత్తుటేమి?' అను కుంటారు, అందరూ. సభకు ఇది తిరస్కారము అని కోపిస్తారు.

దెబ్బ తగిలిన ప్రేయసికి సేదతీర్చేఘట్టము అర్ద్రతతోనిండి ఉంటుంది. వసంతరాయలప్రేమ వెల్లువై ప్రవహిస్తుంది ఈరంగంలో. 'నీవు నాట్యముచేయలేని నిమిషం సూర్యచంద్రులే తమగతులు తప్పుతారు!' అంటాడు ఆ ప్రేమికుడు, ఆమెతో. అతనికోసం, ఆమె తనకాలు వెంటనే నయమవుతుందనీ, మరునాడే, తాను

గజ్జెకట్టగలననీ, ధైర్యమిస్తుంది లకుమ. అపారమైన అతని అను రాగానికి కరగిపోయి, ఎంతో అందంగా అంటుంది :

వెన్నయైన గట్టిపడుట
యున్నదిగానీ స్వామీ !
మెత్తదనము దప్ప మీదు
చిత్తము అన్యమెరుంగదు.

నేను పునర్జన్మమెత్తి
తేని ప్రభూ! రసికతామ
హాలయమౌ మీ యువహృద
యముగా జన్మింతు గాత!

కాని, అసలుగాయము ఆమె కాలికిగాదు. ప్రజల హృద యాలకు, ప్రజలనే కన్నబిడ్డలుగా జూచే పట్టపురాణికి. ప్రజలు తనభర్తను పల్లెత్తుమాట అనడము ఆమె సహింపలేదు. రాజు తన ఇంటికి రావడము మానెననే వ్యథకంటే, అతడు రాచగద్దెను విడిచి వెళ్ళాడనీ, దేశంలో అంతఃకలహాలు తలయెత్తాయనీ, సామంతులకు తాము లోకువ అయ్యామనీ, ఈ బాధ ఆమెను ఎక్కువగా వేధిస్తుంది. చెల్లెలిని చూడవచ్చిన కాటయవేమునికి ఆమె సంతాపముతెలిసి ఆ విషయమై వసంతరాయనితో, ఎంతో వినయంతో ప్రస్తావిస్తాడు. ఇతనిమాటలు, అప్రయత్నంగా, ఆల కించిన లకుమ ఎంతో ప్రయత్నిస్తుంది రాజు పట్టపురాణినీ, తద్వారా, ప్రజలనూ, ఆదరించాలని. అతడు మొదట కరగు తాడు. కాని, ధైర్యంచాలదు, రాణిని ముఖాముఖిచూడడానికి, నిమిషమైనా లకుమను విడిచి ఉండడానికి.

తలపై గంగను దేహా
ర్థమున పార్వతిని నిల్పిన
సర్వజ్ఞుడు అమాయకుని
సరణి దిక్కులను చూచెను!

కాని, ఇక్కడ ద్రాక్షారామంలో వసంతరాయడు బిగ్గరగా 'లకుమా' అని పిలిచేసరికి. అక్కడ, ఎక్కడో, కొండవీట, నిద్రి స్తూన్న పట్టపురాణి ఆకేక విని ఉలిక్కిపడిలేచి, 'ప్రభూ' అంటూ బిక్కు బిక్కుమని ఏడుస్తుంది. ఇటువంటివి జీవితంలో జరుగు తూనేఉంటాయి. దూరము భౌతికశరీరానికేగాని, మనస్సుకు గాదు.

మొట్టమొదటిసారి, రాజు తన్ను కౌగిటజేర్చినపుడు, లకుమ నాదేవత! నారతనాలమొలక! అంటూ, జన్మతరియించే ప్రేమ వాక్కులను

గొంతు తొట్రువడగ పల్కి
కొసరికొసరి యేడ్చె నామె
ఆమె అశ్రుధారలలో
హాసమెంతొ? త్రాసమెంతొ?

రాజాధిరాజు బిచ్చగాడై తన హృదయసామ్రాజ్యమే ఆమె కర్పించినపుడు భయమెందొకొ? పిచ్చితల్లి! కాని, ఆమె అంత రాత్మకుతెలుసు: ఇది హృదయాలతో చెరలాటమనీ, దీనికి ఒకటే అంతమనీ. అందుకే అశ్రుధారలు. అమృతం ఆస్వాది స్తూన్నా సరే, హాలాహలము తలపునకువస్తుంది లకుమవంటి కళాజీవులకు. ఈ త్రాస ఆ రాబోయే అఘాతానికి సూచన.

ద్వితీయాశ్వాసంలోనే తెలుస్తుంది, వసంతరాయలు లకుమను పొగొట్టుకుంటాడని:

అల్లనాటి పురూరవుని ముం
దవతరించిన ఊర్వశికివలె
నేఁడుకొమరగిరీశ్వరుని దృ
గ్వాటిలోపల లకుమ నిల్చెను

అనినప్పుడే అనుకుంటాము: ఇంద్రుని స్నేహితుడైన పురూరవునుకే ఊర్వశీవియోగం తప్పనప్పుడు, ఎంత ప్రేమికుడైనా, సాధారణమనుష్యమాత్రుడు లకుమవంటి దివ్యాంగనను తనకొరకు దక్కించుకోగలడా అని. లకుమవంటివారు ఈలోకాన బ్రతుకలేరు. అట్టి వారికి తమ ప్రేమనిధిని అర్పించిన వారికి మిగిలేది బాధే.

ఈ కావ్యంలో మనలను ఎక్కువగా ఆకర్షించేవి: ఊహ, కల్పన, చిత్రణ. చక్కనిఊహలు ఊహిస్తారు ఈకవి. అందమైన సన్నివేశాలు కల్పిస్తారు. విచిత్రమైన చిత్రాలు చిత్రిస్తారు. తెలుగు భాషలోని అందచందాలను ఎంతో చక్కగా వినియోగిస్తారు తమ కవనమున. పదముల శబ్దమాధుర్యానికి, వింతగా ఊపివేసే లయకు, ఇంగ్లీష్‌లో స్విన్‌బర్న్ ఎల్లాగో, తెలుగులో నారాయణరెడ్డి అల్లాగ:

తుమ్మెదపదములు వెన్నెలపదములు
కమ్మగ గానము చేసెడు వారలు
ఏలలు పాడుచు ఈలలు వేయుచు
సోలుచు తూలుచు పోయెడు వారలు.

రాతిశాసనాలలోనే జీవము నిల్పుకొన్నవ్యక్తులకు పున ర్జన్మ కల్పించి, మన కళ్ళముందు అద్భుతమైన నాటకమాడించారు వారిచేత. రమణీయమైన వాతావరణను నెలకొల్పి, 'ఆ రోజులలో నేనున్నాను కానే' అనిపించేటంత రసవంతంగా వర్ణించారు. భాషా ప్రియులైన సౌందర్యాన్వేషకులు కొంతసేపు తమ అన్వేషణ చాలించి విశ్రమింపతగిన, పరిమళభరితమైన పువ్వులతో విలసిల్లే, చక్కని పుష్పవాటిక ఈ మధురకావ్యము. వసంతరాయలు స్వప్న సీమనుచూచిన పుష్పవాటిలోని పువ్వులిలా,

పూచిన విరికన్నెలన్ని

పూర్ణాయువు నొందు నిందు!

* *